

శ్రీరస్తు.

శ్రీనృసింహస్వామినేనమః.

# నరసింహశతకము

కం. శ్రీమానినీవిమలహృ
త్తామరస దివాకరా సు ♦ దర్శనహస్తా
శ్రీమంగళశైలాధిప
ధామా నరసింహనామ ♦ దైవలలామా. 1

కం. అంబుధిశయనా! మునిహృద
యాంబుజసంచార! ఫణికు ♦ లాధిపశయనా!
కంబుగ్రీవార్చిత పా
దాంబుజయుగ! శౌరి! మంగ ♦ ళాద్రినృసింహా. 2

కం. కుంభీంద్రపాలకా! హరి
కుంభినిపరిపాలకా! య ♦ కుంఠితతేజా!
జంభారివినుత! ఘనకరు
ణాంభోనిధి! దేవ! మంగ ♦ ళాద్రినృసింహా. 3

కం. ధర్మము నిలుప జనించితి
వర్మిలియుగయుగమునందు ♦ నయముగనిపుడున్
ధర్మము నిలుపజనింపుము
శర్మదుఁడవు మంగళాద్రి జయనరసింహా. 4

కం. రోగంబులు తొలఁగును భూ
భాగంబునఁ బ్రబలె మాయభాగ్యము సమ్య

త్త్యాగవిహీనులు ప్రబలిరి
యాగమనుత మంగళాద్రి ♦ యనఘనృసింహా. 5

క. అజ్ఞానిని నినుదెలియఁగ
ప్రజ్ఞాహీననుగదయ్య ♦ పాలింపుమినన్
సుజ్ఞానహృదయవాసా!
యజ్ఞానము బాపి మంగ ♦ ళాద్రినృసింహా. 6

క. నిగమములు బలుకఁజాలవు
నగజాపతినిన్నుఁ దెలియ ♦ డట సేవింపఁ
జగధీశ్వర! సర్వాత్మక!
అగణితదయనేలు మంగ ♦ ళాద్రినృసింహా. 7

క. యోగధ్యానవిహీనులు
భోగపరాయణులు ధాత్రి ♦ బొడమిరి స్వార్థ
త్యాగులఁజేయుము యందఱ
నాగడములు వాపి మంగ ♦ ళాద్రినృసింహా. 8

క. ధ్యానము మానము నాత్మ
జ్ఞానము నెఱుఁగంగలేని ♦ కలుషాత్ములు నీ
మానవులగుచుండి రయో
మానుపవే దుర్గుణములు ♦ మాన్యనృసింహా. 9

క. ఘనరోగపీడితులు మఱి
ధనలోభులు క్రోధమతులు ♦ దంభాకారుల్
గుణహీనులైరినరులిదె
ఘనమతులను జేసిప్రోవు ♦ ఘననరసింహా. 10

క. భుక్తియురక్తియుయుక్తియు
ముక్తియుభక్తియునుశక్తి మొదలెఱుఁగమయో

ము క్తిప్రదుగన మాత్మను
శక్తి నొసఁగు మంగళాద్రి ♦ జయనరసింహా. 11

క. అథమ్ముఁడును ధర్మమెఱుఁగని
యధికారికి సేవచేయుటన్నంబునకై
యధమత్వముగాదే ఘన
పథమెఱుఁగక మంగళాద్రి ♦ భవ్యనృసింహా. 12

క. సేవింపనేటికే తమ
జీవితముంగడుపనీచు ♦ చిత్తులమది స
ద్భావమున నాత్మశక్తిని
సేవింపఁగరాదె నిన్ను ♦ శ్రీనరసింహా. 13

క. సాకారుఁడన్నసేమి ని
రాకారుండన్ననేమి ♦ యఖిలాంతరధ
ర్మైకరతుల్ న్యాయమతుల్
బాగిఁకటగుణధనులకెన్న ♦ భవ్యనృసింహా. 14

క. ధర్మంబె నీస్వరూపము
ధర్మమయుడవీవుసకల ♦ ధర్మరతులె నీ
మర్మమెఱుంగగనేర్తురు
ధర్మవిహీనులకు నీకు ♦ దవ్వునృసింహా. 15

క. ఏవిధిని న్నెఱుఁగందగు
నేవిధిధర్మంబునిలుచు ♦ నెవ్వేళలమా
కేవిధికర్తవ్యమొ నీ
వాకిధిబోధించు మంగ ♦ ళాద్రినృసింహా. 16

క. ఎవఁడు ప్రజోన్నతికైధర
పగివిమలమతినేలునతని ♦ పావనయశమే

రవళించు నెల్లదిక్కుల
కవివాగ్గత్యంబుచూపె ♦ ఘననరసింహా. 17

క. ధర్మమె యుంగసి చదువును
ధర్మము లేనట్టి తెలివి ♦ ధనమును బ్రదుకుం
కర్మములు వ్యర్థములుగద
ధర్మమె నీ తేజమంచు ♦ దలంతు నృసింహా. 18

క. ఏతీరున భావించిన
నాతీరున దోంచుచుందు ♦ వమలాత్ములకున్
భూతదయోన్నతమతులకు
భూతమయా సర్వమీవె పోల నృసింహా. 19

క. దయ నరునకు తోడవెయ్యెడ
దయయే నీరూపమంచు ♦ దలచెద నేనా
దయ లేనివాడు శాస్త్రవ
జయముం గాంచంగ లేడు ♦ జయ నరసింహా. 20

క. ధనలోభమతికి దయయును
వినయము త్యాగంబు స్నేహ ♦ విభవంబును నె
మ్మనమున నెక్కువు ధనమే
ఘనమా సద్గుణము ఘనము ♦ ఘననరసింహా. 21

క. పరహితమతి కవ్వేళను
గురుతింపగ హేతువేల ♦ ఘోరిమి చూపం
బరహింసాసక్తునకును
గురుకారణమేల చెఱుప ♦ గోరు నృసింహా. 22

క. అర్థప్రియులెఱచును స
ర్వార్థప్రదునిన్ను దెలియ ♦ రజ్ఞానులుభో
గార్థములును గడపటిపురు
షార్థముతో లెనని యార్య ♦ లంద్రునృసింహా. 23

క. శాంతాత్ములు నీభక్తులు
శాంతాత్ములై నిన్నుఱుంగ ♦ జాలుదురెదలో
శాంతవిహీనులకునునీ
కెంతోదూరంబుజగద ♦ ధీశనృసింహా. 24

క. శాంతవిహీనుండా దివి
జాంతకుడెఱుగంగ జాలె ♦ నానిన్నుమహా
శాంతుడు ప్రహ్లాదుడుబహి
రంతరములనిన్నెచూచె ♦ నయ్యనృసింహా. 25

క. శాంతంబె ముక్తినిచ్చును
శాంతవిహీనునకు నాత్మ ♦ సౌఖ్యముగలదా
శాంతమె గౌరవమొసగును
శాంతునకగు నిత్యసంత ♦ సంబునృసింహా. 26

క. నిర్మలము నిరుపమానము
ధర్మమయము నీచరితము ♦ దలచెద నాదు
ష్కర్మములు దొలగిపోవగ
కల్మషహారమంగళాద్రి ♦ ఘననరసింహా. 27

క. మిత్రంబులు సుజనులకు ప
విత్రంబులునఘలతాల ♦ విత్రంబులుస
త్పాత్రములు పొగడనీదుచ
రిత్రంబులు మంగళాద్రి ♦ శ్రీనరసింహా. 28

క భూరిభయవిదారణములు
కారణములు మోక్షరాజ్య ♦ గరిమకునీస 28
చ్చారిత్రవర్ణనలు భవ
హారివి గదె నీవుమంగ ♦ ళాద్రినృసింహా. 29

క. అరివర్గహారివని నిను
బరివిధములనుభక్తి ♦ భావించిమదిం
దిరముగనమ్మితి కూరిమి
నరయఁగదే నన్ను మంగ ♦ ళాద్రినృసింహా. 30

క. కల్యాణదాయివని వై
కల్యము లేకుండ గొలుతు ♦ గద వేమారుం
గల్యాణము లొసగుము సా
కల్యముగా మంగళాద్రి ♦ ఘననరసింహా. 31

క. మంగళగిరి నిలయా నీ
మంగళతరమహితగుణస ♦ మాజం బెన్న
న్మంగళము లొసఁగు నెపుడు శు
భాంగా మమ్మేలుమంగ ♦ ళాద్రినృసింహా. 32

క. ఎవ్వఁడు నినుమదినమ్మునొ
యెవ్వనిఁ రక్షింపనీవు ♦ నెంతువొ వాని
న్నెవ్వగలఁగుండ జేతువు
నవ్వులకో యేమొగాని ♦ నవ్యనృసింహా. 33

క. అపనిందల నొందింతువు
నపరాధియటంచుమనుజు ♦ లనఁ జేతువు నీ
చపుదశ నొందింతువు నీ
కృపచూపవు గాదె మొదట ♦ శ్రీనరసింహా। 34

క. అప్పటికిని నిశ్చలమతి
చప్పక నిన్నాత్మ నెంచు ♦ ధర్మాత్ముని నీ
వెప్పటికిని రక్షింతువు
చెప్పితి నే నిదినిజంబు ♦ శ్రీనరసింహా! 35

క. పలుక నశక్యంబగు మది
దలఁచిన కొలఁదినివిచిత్ర ♦ తరమగు నీలీ
లలు నిట్టివనినుతింపఁగ
నలవియొక్కో యెవరికైన ♦ ననఘనృసింహా! 36

క. ముక్తి సతీమణిమాళిని
ముక్తామణులగు నీపద ♦ ములు పొగడఁగ న
వ్యక్తను నే నేరఁజుమీ
శక్తిత్రయమూర్తి వీవు ♦ జయనరసింహా! 37

క. పొంతనములు ముక్తిశ్రుతి
కాంతా సీమంతవీధి ♦ ఘనభూషలు పా
దాంతమహితదీధితులా
ద్యంతస్థితిరహితమంగ ♦ ళాదినృసింహా! 38

క. ఏ తేజ మనలశశిఖ
ద్యోతాదులయందు వెలుఁగు ♦ నో భూతౌఘం
బే తేజముచే నలరెడి
నాతేజమెగొలుతు మంగ ♦ ళాదినృసింహా! 39

క. శ్రీకరము నఖిలశతృని
రాకరమును మహితకీర్తి ♦ కాకరమును సౌ
ఖ్యాకరమగు కల్యాణగు
ణాకర నీసేవ మంగ ♦ ళాదినృసింహా! 40

క. బాలుఁడు ప్రహ్లాదునిలో
నాలోచింపంగఁ బెద్ద ♦ యగునారదులో
చాలవెలుఁగు నీ తేజము
లాలిత గుణజాల నేదఁ ♦ లంతు నృసింహా! 41

క. చారుతరమంగళాద్రి ఘ
నారామవిహారకౌతు ♦ కాయత్తమతీ!
సూరిజన హృదయ పద్మవి
హారా! రవితేజ! మంగ ♦ ళాద్రినృసింహా! 42

క. మంగళతర మంగళగిరి
శృంగాగ్రవిహారనార ♦ సింహాకారా
సంగరహితమునిమానస
రంగన్మణిపీఠవాస ♦ రమ్య నృసింహా! 43

క. సామాదిగానలోల ని
రామయుఁడవు భూతమయుఁడ ♦ వమలుఁడ వనుచుం
బ్రేమంబున నుతిచేతును
కామితఫలదాతవీవు ♦ ఘన నరసింహా! 44

క. సారస దళలోచన నీ
చారుపదాంబుజయుగంబు ♦ సద్భక్తిని హృ
త్సారసమునఁ గొల్చెదభవ
తారకమని మంగళాద్రి ♦ ధామనృసింహా 45

క. ఆద్యమ నిర్వచనీయము
హృద్యము నిరవధిక మనుప ♦ మేయము శ్రుతిసం
వేద్యంబునీదు చరితం
బాద్యంత విహీన మంగ ♦ ళాద్రి నృసింహా! 46

క. ప్రజ్ఞానులు నిశ్చలది
వ్యజ్ఞానులు నైనఁ దెలియఁ ♦ గానేరరు నే
నజ్ఞాని నెఱుఁగ నేర్తు న
ప్రజ్ఞానమయస్వరూప ♦ భవ్యనృసింహా! 47

క. నిరవధివై నిర్విధివై
నిరంజన నిరామయతను ♦ నెట్టివర్గెడి ని
న్నరసి తెలియఁగఁగలరే
హరసురవిధులైనమంగ ♦ ళాద్రినృసింహా! 48

క. నిను సగుణుఁడు సాకారుం
డనినను నిర్గుణుఁడు మఱి ని ♦ రాకారుండే
యనినను యెటులెన్నిన నా
మనమున నానంద మొదవు ♦ మాన్యనృసింహా! 49

క. వేదండవరద బాయక
నీదుపదాబ్జములు గొలుతు ♦ నిశ్చలమతిన్
నీదరి జేరితి నన్ను ఘ
నాదరమునఁ బ్రోవుమంగ ♦ ళాద్రినృసింహా! 50

క. నానాథుని సఫలీకృత
మనోరథునిఁ జేసి ప్రోవు ♦ మా! దయతోడన్
నీనామమె దలఁచెద నీ
యానసుమీ! మంగళాద్రి ♦ యమలనృసింహా! 51

క. నమ్మితి నీపదయుగళము
నెమ్మదిని నిరంతరంబు ♦ నిండినభక్తిన్
నమ్మినఁ బ్రోచుట నీకును
సొమ్ముగదే మంగళాద్రి ♦ శుభనరసింహా! 52

క. భూషింపనేరఁ జెక్కులు
శేషశయన! నిన్ను మదిని ♦ సేవింతు మముం
బోషింపు మార్తరక్షక
భూషణమిదిగాదె నీకుఁ ♦ బుణ్యనృసింహ! 53

క. నీపదము లెన్నువారల
నాపదలను బాపి సుఖము ♦ లందింపంగా
తాపత్రయాబ్ధి గడవఁగ
నీవనిగదె మంగళాద్రి ♦ నిలయనృసింహా! 54

క. తెలిసియుఁ దెలియక తప్పులు
పలికినచో దేవ! మదిని ♦ బాటింపక ని
శ్చల భక్తి నొసఁగి ప్రోవుము
అలఘు దయానిలయ మంగ ♦ ళాద్రినృసింహా! 55

క. సతులకు పతియందు ప్రియమో
న్నతి భూతదయాంచితియును ♦ నయ విద్యాసం
తత ధైర్యమతియు సజ్జన
హితమతియు నొసంగి ప్రోవు ♦ మీశనృసింహా! 56

క. మానవతులపై మది సను
మానము నాయమును బాపి ♦ మాత్సర్యమతు
ల్మాన కపటంపు మోహపుట
యేనాఁడును గలుగ మానవె ♦ యీశా! నృసింహా! 57

క. ఇది నిజమా కాదా యని
మదిలోఁ జర్చింపకొరుల ♦ మదిఁగలఁగం బె
ట్టిదముగఁ బలుకుటె యెవ్వఁడు
ముదమగు దుష్టులకు విమల ♦ మూర్తినృసింహా! 58

క. సోదరభావోన్నతి మరి
యాదవిహీనులకుఁ దెలియ ♦ దకటా! కాలో
న్మాదంబటంచు నితరుల
కావని తిట్టుటయె తెలియుఁగాని నృసింహా! 59

క. తరుణులఁ జుల్కదనంబుగ
నరయక నెవ్వేళ గూర ♦ వార్తలటంచుం
గరము దలంపగఁ జేయుము
పురుషుల నెన్నుచుములందు ♦ బుణ్యనృసింహా! 60

క. తన బాహుకలిమి దైవం
బును సత్యమున మ్మిదోహ ♦ మును జేయక ని
మ్మనమున సుఖ మొందగఁ నీ
జనులకు బోధింపుమిావు ♦ జయనరసింహా! 61

క. తలిదండ్రులకును బిడ్డల
కిలను సహోదరులకైన ♦ నెయ్యడ వైరం
బులు పెంచు ధనము నేటికిఁ
గలిగించితి వీజగమున ♦ ఘనసరసింహా! 62

క. తల్లినిబిడ్డలు బిడ్డలఁ
దల్లియు భగినులను నన్న ♦ దమ్ములు హితులుం
గల్లరులై ధనమునకై
చల్లగ మోసంబొనర్తు ♦ జయనరసింహా! 63

క. స్వార్థపరులైన దుర్మతు
లర్థమునార్జించి కీర్తి నాశింపరు స
ర్వార్థపరుదనిను గొంతురు
స్వార్థత్యాగులగదయ్య ♦ జయనరసింహా! 64

క. అందఱు పరమార్థమతిం
జెంది చరించినను గీర్తి ♦ జెంద దెవరికిన్
గొందఱు లోభులనుండినఁ
బొందును యశము నొక్కపుణ్య ♦ పురుషనృసింహా! 65

క. ధృతశాస్త్ర సగ్రపుత్రుఁడు
హితమతి ధర్మాత్ముఁడైన ♦ నిఁక ధర్మజు సం
గతియేలవ్యాసునకు భా
రతరచనావసరమేల ♦ రమ్యనృసింహా! 66

క. పరు నష్టపఱచుమతికిఁ
బరుడింపఁగరానిసుఖముఁ ♦ బొందుధరిత్రిం
బరులాభం బెదగోరెడు
పురుషుండిహసుఖముగోరఁ ♦ బోడు నృసింహా! 67

క. పరహితరతమతి నెన్నఁగ
బురుడింపఁగ రాని యశము ♦ బొందుధరిత్రిం
గురుతరసుఖమానసుఁడై
పరమపదమునందుఁ జేరు ♦ భవ్యనృసింహా! 68

క. ధర్మమునకె త్రైశంకుఁడు
ధర్మసుతుఁడు నలుఁడు రామ ♦ ధరణీశ్వరుడున్
నిర్మలకీర్తి ధనులు న
త్కర్మలు బాధలు సైచిరి ♦ కద నరసింహా! 69

క. సత్యమునకు సంకెలలు న
సత్యమునకు నందఁములు ♦ సత్యముచున్నా
సత్యరతుఁడు దివికేగియు
నిత్యము బుధవరులు పొగడఁ నెగడునృసింహా! 70

క. సురవైరిని యాచించుట
సురలకొఱకెకాని, నీదు ♦ సుఖమునకా నీ
పరహితశీలమె రక్షా
భరణంబై యొప్పె నీకు ♦ భవ్యనృసింహా.

క. కపిలుడవై ఘనతత్త్వము
నుపదేశించితి విదేహ ♦ హూతికి దయతో
నపగతకల్మషులకు నీ
కృపగల్గును మంగళాద్రి ♦ శ్రీనరసింహా! 72

క. వైజ్జవు భవరోగములకు
నొజ్జవు విద్యలకు బుధజ ♦ నోత్తములకు నీ
ముజ్జగముల కీశుఁడవని
సజ్జనులు నుతింతురయ్య ♦ జయనరసింహా· 73

క. దనుజపతికి మోక్షపురీ
ఘనతరపట్టాభిషేక ♦ కాలమునందున్
గనకపు సింహాసనములు
నసఘు మునీయూరుయుగళ ♦ మయ్యె నృసింహా! 74

క. నీపాదసేవకులకును
రూపింపగ సుప్రసన్న ♦ రూపివి పరసం
తాపకులకు గోపకులకు
పాపులకును భయకరుడవు ♦ భవ్యనృసింహా· 75

క. ఎక్కడఁజూచిన నీవే
యొక్కరుఁడవు పిక్కటిల్లి • యుండెద వైన
న్నిక్కముఁ దెలియనివారల
కెక్కడ జిక్కవుగదయ్య • యీశనృసింహా 76

క. సతులును శూద్రులు విద్యో
న్నతి నెఱుఁగనివారు పేదనరులును సత్యా
వ్రతులై నమ్మిన శ్రోత్రియు
హితకారివి సర్వసముఁడ • వీవు నృసింహా! 77

క. కులమును మతమును భేదము
దలపంగా నీకు లేదు • నచ్చుఁజూతువు నిం
దలచిన నిర్మలచిత్తుల
కలుషంబులు వాపి బ్రీతి • ఘననరసింహా! 78

క. ప్రణవస్వరూప! నీపైఁ
బ్రణయంబున వినుతి జేసి • ప్రణతులొనర్తుం
గణుతింపరాని పదవిం
గణనాతీతుఁడఁ మోసంగ • గదె నరసింహా 79

క. సత్యం బెఱుంగఁజాలరు
సత్యముఁబలుకంగ లేదు • సాధుజనుల యా
న్నత్యంబుఁజూచి సైఁపరు
సత్యం బీమాట దుష్ట • జనులు నృసింహా 80

క. లోకావళి యెల్లప్పుడు
నీకుక్షి నడంగుఁ బోడము • నిలుచు న్వెలుగుం
లోకేశ! నిను నుతింపఁగ
నాకలవియె మంగళాద్రి • నవ్యనృసింహా 81

క. నిర్మలహృదయులఁ జేయుమి!
ధర్మంబులు దెలిపి మాకు ♦ దండ్రీ! మాదు
ష్కర్మములఁ బాపి బ్రోవుమి!
శర్మదచారిత్ర దేవ ♦ జయనరసింహా! 82

క. ఒకనుంత చదువొసంగితి
వికలంకా! నిను ♦ నుతింపన య్యెను నాకు
సకలజ్ఞనుగాను సుమీ!
యకలుషదయనేలుమంగ ♦ శాద్రినృసింహా! 83

క. పతియును గురుజనులును గను
హితమతులగు టన్నెంచి ♦ యిటు వ్రాసితినో
నుతనీయ యెల్లవారల
హితవిదోత్ప్రన్నతుఁలఁ జేయు ♦ మిావృనృసింహా! 84

క. భువనభరంబు ఁజీవిన నీ
యవిరళ మహిమాన్వితములు ♦ ననఘంబులు నీ
యవతారంబులు పొగడఁగ
నవనిఁశంబైనఁజెప్ప ♦ నింతునృసింహా! 85

క. ఖలుఁడగు నసురుఁడు ప్రాజను
వులు హరియింపంగ వానిఁ ♦ బాలియించిన నీ
జలచరతనువు నుతింపఁగ
నలవియొకో మంగళాద్రి ♦ యసురులనృసింహా! 86

క. మేటిగిరి భరించితి తా
మేటివినై దేవతలక ♦ మృతమిడితివిగా
బోటివినై నీకగు స
ర్యాటలె యీపనులు మంగ ♦ ళాద్రినృసింహా 87

క. పటుదంష్ట్రా భీకరయును
సటాజనితవాతభిన్న ♦ జలదౌఘుంబౌ
కిటిరూపంబున దైత్యుని
హాటమడఁచితిగాదె ♦ మంగళాద్రినృసింహా! 88

క. శరదిందుశేఖరుఁబోలెడు
వరదంష్ట్రాగ్రమునఁదాల్ప ♦ వన్నదలిర్చెం
ధరపుణ్యమేమిచేసెనొ
యరయంగాదేవ! మంగ ♦ ళాద్రినృసింహా

క. నరరూపము సగము మహా 89
హరిరూపము సగము దాల్చి ♦ యమరులు వొగడన్
బరువడిఁగంబము వెడలితి
సురవైరికుమారుఁబ్రోవ ♦ శుభనరసింహా! 90

క. శిఖసమములు వజ్రాయుధ
నఖముల్ దనుజేంద్రుఁగూల్ప ♦ ధన్యాత్ములకు
న్నఖములు సుఖములు నఖముల
నఖలేశా! మదిదలంతు ♦ నయ్యా! నృసింహా. 91

క. శుభకరమునఁ బ్రహ్లాదుని
కభయమొసంగితివి మాకు ♦ నాగతి దయతో
నభయంబొసంగు మరివ
ర్గభయంబును బాపి శ్రీశ ♦ రమ్యనృసింహా! 92

క. అరుణసటాభరచరితా
ధరభ్రూకుటీకుటిలధవళ ♦ దంష్ట్రాజ్వాలమా
నరసింహరూపమొందిన
నరుఁడాగదవయ్య! మంగళ ♦ ళాద్రినృసింహా. 93

క. నిశ్చలభక్తుని బ్రోవఁగ
గుశ్చితు నాభువనకంట ♦ కునిఁ గూల్పఁగనే
మాశ్చర్యరూపధారక!
నిశ్చలమతినిమ్ము మాకు ♦ నేడునృసింహా. 94

క. వామనుఁడవునై భువన
స్తోమంబులు పాదయుగముతోఁ ♦ గొల్చితిగా
నీమహిమ వింత సురర
క్షామన మమ్మేలు మంగ ♦ ళాద్రినృసింహా 95

క. భీమకుఠారంబున భృగు
రాముఁడవై దుష్టులైన ♦ రాజన్యుల సం
గ్రామమునఁ గూల్చి జగదభి
రాముఁడవై యలరినావు ♦ రమ్యనృసింహా. 96

క. దశవదన వదనపంకజ
శశివై రఘురాముఁడౌచు ♦ జనియించితివా
దశరథపుణ్యఫలమవై
యసదృశచారిత్ర మంగ ♦ ళాద్రినృసింహా. 97

క. కృష్ణారి హరివై రిపు
జిష్ణుఁడవై నిహతగర్వ ♦ జిష్ణుఁడవగుచుం
గృష్ణరహితులను బ్రోచితి
కృష్ణాఖ్యను మంగళాద్రి ♦ శ్రీనరసింహా. 98

క. నను నెవ్వరు దూషించిన
ఘనదేహా వారియందు ♦ గార్పణ్యంబుం
మనమునఁ జొరనీకుండెడు
ఘనశక్తి నొసంగు నాకు ♦ ఘననరసింహా. 99

క. విశ్వమయత నొప్పెడు నో
విశ్వేశ్వర ! నీదురూపు ♦ విమలాత్ములునై
శాశ్వతభక్తిఁ దలంచిన
శాశ్వతసుఖపదవిగలుగు ♦ జయనరసింహా. 100

క. దివ్యంబై మునిజనసం
భావ్యంబై రవిసహస్ర ♦ భాస్వరమై సం
సేవ్యంబు సుజనులకు నో
యవ్యయ నీరూపుమంగ ♦ ళాద్రినృసింహా! 101

క. ఈయుగపుమహిమయేమో
మాయోపాయంబు లేక ♦ మనలేరెవరున్
మాయోపాయము లేని య
మాయకు వంచింత్రు దుష్ట ♦ మతులు నృసింహా. 102

క. కలికాలమహిమ సతులను
దలఁపంగా సతులె తిట్టఁ ♦ దలతురు కట్టా !
పలుకం దెలియ నశక్యం
బిల దుష్టులమానసంబు ♦ లీశనృసింహా 103

క. పశులను వంచన సేయక
పరహితరతమతియుగలిగి ♦ వర్తించిన నా
నరులఁ దెలివివిహీనులఁటని
దురితాత్ములు గేలిసేయు ♦ దుసనరసింహా. 104

క. ఇతరుల యమాయకత దు
ర్నతులు దెలివిహీనతయని ♦ మదినెంతురు పాం
డుతనూజులసాధుత్వము
ధృతరాష్ట్రతనూజు లెఱిగి ♦ రే నరసింహా. 105

క. పరసతిఁ దన సోదరిగా
నరయుచు వారియశముగని ♦ హర్షించెదు నా
పరమపురుషులకు నిరతము 106
వరభక్తి నమస్కరింతు ♦ వర నరసింహా.

క. నిర్మలచిత్తుల హృదయము
నిర్మలమే యనుచుఁ దెలియనేర ♦ రకుమతుల్
నిర్మలమతులం జేయుమి !
నర్మిలి నీవెల్లవారి ♦ నన్యనృసింహా. 107

క. బిడ్డల యందైనను కడు
చెడ్డతనముగలుగువారి ♦ సేవింతు ప్రమదిం
దొడ్డగ వెఱతును నోటికిఁ
జెడ్డతనమె మంచిదేమొ ♦ శ్రీనరసింహా. 108

క. అపనిందల మోపి ననుం
గపటముతోఁజూచి చుల్క ♦ గనెంచిన నీ
చపుఁగఠినోక్తులు పల్కన
నెపుడును ఘనశాంతమిమ్ము ♦ యీశనృసింహా. 109

క. ఘనకీర్తియిహమునను బర
మున ముక్తినొసంగి మోద ♦ మును జూపుమునీ
కృపఁగోరితి శ్రీకరుడవు
నపగతకల్మషుఁడ మంగ ♦ ళాచలరమణా. 110

క. కరుణానిలయుడ వాశ్రిత
వరదుండవు సాధుహృదయవాసుడవని నే
దిరముగ నమ్మితి గూరిమి
నరయుమి నరసింహమంగ ♦ ళాచలరమణా. 111

గీ. మాల్యశైలేంద్రశృంగాగ్ర ♦ మణివిరాజి
తకృతివి నీవె శ్రీమంగ ♦ ళాద్రిశృంగ
వాసుఁడవు నీవె యోభక్త ♦ వరదమాకు
సర్వశుభములు ప్రీతినో ♦ సంగుమయ్య. 112

గీ. పరమశాంతము నిమ్మంచుఁ ♦ బరమభక్తి
వేడుచుంటిని దయలేదె ♦ విశ్వమూర్తి
యక్కటా తలచూపు న ♦ హంకృతి యవు
దప్పు డిది యేమిపాపమో ♦ యరయజాల. 113

ఉ. హారికి మంగళాద్రిశిఖరాగ్రవిహారికి వేదమార్గసం
చారికి సాధుమానసలసన్మణిమందిరసుప్రచారికిన్
కూరిమి నేలు మము కోరికలీరికలెత్త మ్రొక్కుడుం
సారవిచారమానసను సజ్జనసన్నుతిపాత్రఁ జేయఁగన్. 114

క. ధననష్టమైనగానీ
నను జుల్కన చేసి తూల ♦ నాడిన విననా
డిన నేరినైన గినియక
ఘనశాంతముతో జరింప ♦ గా ధృతినిమ్మా. 115

ఆ. మోసకారితనము దోసకారితనంబు
మాయువిచ్చకంపు మాటనేర్పు
పరధనంబుకాసపడెడు మానసవృత్తి
మాకు నీవలదుసుమా నృసింహా. 116

## By the Same Author.

| | | |
|---|---|---|
| అంబరీషవిజయము | నవరసభరితము ప్రబంధము | 0-12-0 |
| లక్షణాపరిణయము. | డిటో | 0-12-0 |
| నర్మదా పురుకుత్సీయము. | నాటకము | 0-12-0 |
| లోకతంత్రము-అనులోకాపలోకనము [నవల] | | 0-12-0 |
| శ్రీగాంధిపాటలు | | 0- 2-0 |
| శ్రీఆంజనేయస్తవము | | 0- 1-0 |
| శ్రీరాజరాజేశ్వరీ నక్షత్రమాల. | | 0-2-0 |
| శ్రీమంగళాద్రి నృసింహశతకము. | | 0-2-0 |

ఇవి మొదలుగాగల సుప్రసిద్ధ ఆంధ్రగ్రంథములు పెక్కుగలవు.

రంగుల చిత్రపటములు.

1. దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుగారి
పటము. 0-2-0

2. రామదాసు ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారి
చిత్రపటము. 0-2-0

డజను.కు 1-2-0; 100 రు. 6-4-0

కార్యదర్శి

విద్యావిలాససభ

బెజవాడ,